# పాంచజన్యము

భావఝురి

(కవితా సంపుటి)

రచన

నెమ్మాని మోహనమూర్తి

నిర్వహణ

మైత్రేయా కళాసమితి

సంగారెడ్డి

ప్రథమ ముద్రణ : ఆగష్టు 1990



వెల : రూ॥ 10-00 లు మాత్రమే

రచయిత చిరునామా :

నెమ్మాని మోహనమూర్తి
క్యాషియర్
మెదక్ జిల్లా సహకార కేంద్ర బ్యాంకు లి.
సంగారెడ్డి - 502 001.

ముఖచిత్రం :

యం. రమేశ్

ముద్రణ :

శ్రీ శ్రీనివాస ప్రింటర్స్ అండ్ బైండర్స్,
సంగారెడ్డి



జి. లతాకృష్ణారావు ఐ.ఏ.యస్.,
కలెక్టర్ మరియు జిల్లా మెజిస్ట్రేట్

మెదక్ జిల్లా
కే.స్థా. సంగారెడ్డి

# ముందు మాట

శ్రీ నెమ్మాని మోహనమూర్తి గారు రచించిన "పాంచజన్యము" గేయ సంపుటిని చదివి ఎంతో సంతోషించాను. వీరు తమ రచనలో పలు అభిప్రాయాలు స్వేచ్ఛగా మరియు నిరాఘాటముగా వెలిబుచ్చినారు. అందు స్త్రీ, స్నేహం, విజయ శీలం, గాంధీ, సప్త రత్నాకరం మరియు ఉగాది చిగురులు ముఖ్యంగా పేర్కొనదగినవి. "స్నేహం" శీర్షికన ఒకచోట "తల్లి బిడ్డల అనుబంధం - దేవుని భక్తుల సంబంధం, సహృదయులకు చక్కని వరము - గతులు తప్పెనా దుర్భరము" అన్నది స్నేహానికి చక్కని ఉపమానము. దేశ రక్షణలో సైనికుని పాత్ర అతి ముఖ్యమని చెప్పుచూ "విజయ శీలం" గేయంతో "దేశ రక్షణే పరమావధిగా

ఆకలి దప్పుల నధిగమించే అరివీర భయంకరా, జై జవాను నీకు జోహారు.'' ఈవిధముగా గేయ కవిత్వ సంపుటి ఎంతో నిర్మలముగా, శాంతముగా, గంభీరముగా ఉండి చదువరులకు అమిత అభిరుచిని కల్గించును.

వీరు ఇదే విధముగా తన కవితా స్రవంతితో ప్రగతి పథంలో ఎంతో ముందుకు పురోగమించాలని ఆకాంక్షిస్తున్నాను.

సం/-

తేది 28-7-1980

జి. లతాకృష్ణారావు

డి. రామకృష్ణ
B.Sc., M.A., LL.B.
అధ్యక్షులు

జిల్లా ప్రజా పరిషత్తు మెదక్
సంగారెడ్డి.

# అభినందన

శ్రీ నెమ్మాని మోహనమూర్తి, మెదక్ జిల్లా సహకార కేంద్ర బ్యాంకు వుద్యోగిగా, మామైత్రేయ కళా సమితివ్యవస్థాపకుల్లో ఒకడుగా, సమితి కార్యదర్శిగా, మంచి నటుడుగా, దర్శకుడుగా, సాంస్కృతిక కార్యక్రమాల వ్యాఖ్యాతగానే మా అందరికీ తెలుసు! కాని—యీమధ్యనే ఆయన "భావఝరి"ని చూసి, ఆస్వాదించి, ఆశ్చర్యపోయాను. కాగితం మీద పెట్టిన ఆయన భావ పరంపరలను చూసి, చదివి చాలా ఆనందించాను.

చతుష్షష్టి కళల్లో సాహిత్యానికి ఎంతో ప్రముఖ స్థానముంది. సాహిత్యంలో ఆసక్తి వుండటంవేరు— ప్రవేశం కలిగి వుండటం వేరు! భాషమీద కొంతైనా "కమాండ్" వుంటేనే కాని, అందులో ప్రవేశం కలగటం కష్టం!

వ్యాకరణ యుక్తంగా, ఛందోబద్ధంగా, సమాస భూయిష్టంగా— కవిత్వం వుండటం ప్రశంసనీయమే! అది కవి

గొప్పదనమే! కాని-— కవి వుద్దేశ్యం, భావం, ఆవేదన...... సామాన్య పాఠకుడికి కూడా అర్ధమయ్యేరీతిలో కవిత్వం వుండటమే సర్వదా ఆదరణీయమని నా అభిప్రాయం!

ఆదే విధంగా శ్రీ మోహనమూర్తి "పుట్టినరోజు"లో నగ్న సత్యాల్ని, "విద్యార్థి" లో నేటి విద్యార్థులకు హెచ్చరికను, "స్నేహం" లోని మాధుర్యాన్ని, "స్త్రీ" లోని ముగ్ధమోహన రూపాన్ని, "భావి భారతి" లో దేశభక్తినీ, "సంఘశక్తి" లో శ్రీసూక్తులనూ, ప్రతివారికీ అర్ధమయ్యేలా, కళ్ళకు కట్టినట్లుగా తన రచనా చాతుర్యాన్ని ప్రదర్శించినందుకు నిజానికి అభినందనీయుడు.

నేటి సమాజంలోకి తరచిచూచి. అందులోని లోటు పాట్లను. మంచీచెడులను సరిదిద్దాలనే తాపత్రయంతో తన "పాంచజన్యము" ద్వారా జాతిని జాగృతం చేస్తున్నందుకు శ్రీ మోహనమూర్తిని మనసారా ఆభినందిస్తున్నాను.

శ్రీ నెమ్మాని ముందు ముందు యింకా మంచి రచనలు చేయాలనీ, అతనిలోవున్న కళాపిపాస ఉన్నత శిఖరాలను అందుకోవాలనీ, అతను సాహితీవనంలో మరింత భాసిల్లాలనీ మనసారా కోరుకుంటూ, ఈ అభినందన!

సం/-
డి. రామకృష్ణ

కె. సి. పెంచలయ్య M.A., B.Ed.
జిల్లా విద్యాశాఖాధికారి

మెదకు జిల్లా
సంగారెడ్డి

# ఆకాంక్ష

సాహిత్య ప్రయోజనాన్ని గురించి ప్రామాణికులు నిర్ద్వంద్వంగా హితం సహితం అని పేర్కొన్నారు. బహుజన అభిప్రాయము కూడా సాహిత్య ప్రయోజనము, సామాజికపు శ్రేయస్సు. సాహిత్యం ద్వారా సాధించలేనిదంటూలేదు. అదియును గాక ఏయుగపు, కాలపు సాహిత్యమైనా, ఆయుగపు. కాలపు, దర్పణం మాత్రమే. మారిన కాల పరిస్థితుల దృష్ట్యా ఈనాడు ప్రబంధాలు, కావ్యాలు, చదివే తీరిక ఓపిక లేదు. కాబట్టి కాలానుగుణంగా కవిత్వరీతులలో. ఫక్కీలలో మార్పును మనము గమనిస్తున్నాము. ఆకోవలోనికి చేరినవే లఘు కవితలు. ఆ లఘు కవితల ద్వారా, సూటి మాటలతో హృదయాన్నితాకే రీతిగా రచయిత తన ఆవేదనలను, తాను కోరే మార్పులను, పాఠకుల హృదయాంతరాళల్ని తాకేరీతిగా, పదముల పొందుపర్చుట, నేటి కాలపు ఒకానొక లక్షణము. అభివృద్ధికాముకులైన అనేక సిద్ధాంత కర్తలు, పరిపాలకులు సైతము సర్వకళలు మానవ, వికాసమునకే అని

పేర్కొనుట జరిగినది. దాన్ని దృష్టి యందుంచుకొని కావచ్చు మన రచయిత శ్రీ నెమ్మాని మోహనమూర్తి తన పరిసరాలను, వాటి ఒడుదుడుకులకు స్పందించి తన ఆవేదనను వెళ్ళబుచ్చుకొనుట జరిగింది. సమస్యకు కారణాలను కనుగొనగలిగితే ఆకారణ భూతులను, ఆరికట్టిన, ఆ సమస్యనే వుండదు. అదే విధంగా నేడు పెరుగుతున్న కక్షలు, కార్పణ్యాలు, జాతీయ విపత్తులు. కులతత్త్వము. నిరుద్యోగము, శ్రమ దోపిడీలాంటి సమస్యలపై సూచన ప్రాయంగా, వ్యంగ్యధోరణిలో కూడా సూచించుటలో, కూడా రచయిత సఫలీకృతులైనారు.

కాబట్టి భవిషత్తులో కూడా ఇటువంటి మిత్రుల కలము నుండి ప్రబోధాత్మకమైన. వస్తువులో నవ్యత, భాషలో నవ్యత. భావనలో నవ్యత గల రచనలు రాగలవని కాంక్షిస్తూ.

సం/-
కె. సి. పెంచలయ్యా

# నాదవేదన

ఆధునిక తెలుగు కవిత వచన కవితగా ప్రాధాన్యమునూ, ప్రాచుర్యమునూ సంతరించుకున్న తరువాత కవుల సంఖ్య బాహుళ్యం పొందింది. ఆధునిక కవులెందరో ఈనాడు సామాజిక స్థితిగతులకు స్పందించి సాధ్యమైనంత వరకు నిజాయితీగా కవితలు రాయడం హర్షణీయం. కేవలం ఊహల ఊయలలో తేలిపోకుండా వర్తమాన మానవజీవన గతులనూ, మతులనూ కృతులుగా సాహితీ కృషి సాగిస్తున్నారు. నేటి రచయితలు. ఈలాంటి కవుల వరుసలో చేరిన కవి శ్రీ నెమ్మాని మోహనమూర్తి.

శ్రీ మోహనమూర్తి మెదకు జిల్లా సహకార కేంద్ర బ్యాంకు, సంగారెడ్డి శాఖలో క్యాషియరుగా ఉద్యోగించుచున్నాడు. విధి నిర్వహణ సక్రమంగా నిర్వర్తిస్తూ కళాపిపాసతో నటుడుగా దర్శకుడుగా, సాంస్కృతిక కార్యక్రమాల వ్యాఖ్యాతగా రాణించిన మోహనమూర్తి కవితా రచన సాగించడం అభినందనీయం. వర్తమాన సమాజ స్వరూపాన్ని రోగగ్రస్తంగా చేస్తున్న రకరకాల వికారాలకు స్పందించి, మనసులో మోసులెత్తిన బడ బాగ్ని కీలల వంటి భావాలనూ, మూగరోదనల వంటి రాగాలనూ పాంచజన్య ఘోషగా వినిపించాడు ఈ యువ కవి శ్రీ మోహనమూర్తి. ఇందుకు 'నాలో' కవితను ఉదాహరణగా చూడవచ్చు.

మంచిని సమాధి కట్టే వంచననూ, నిజాన్ని మ్రింగే అసత్య ప్రవచనాలనూ, నీతి నియమాలను అడుముతున్న నయవంచక కీచకులనూ. నిజాయితీని నంజుకుతినే దుర్జన బకాసురులనూ చూచి బడబాగ్ని కీలల సెగలై ఎగసిన భావనలు కవితలుగా రూపొందినాయి.

'రాజకీయము' అనే పంచాక్షరిని విశ్లేషించిన వైనం చమత్కార జనకంగా వుంది. ఈ విశ్లేషణ నేటి కుటిల రాజకీయపు తీరుతెన్నులను వన్నె చిన్నెలతో వర్ణిస్తున్నది. స్నేహ జీవన మాధుర్యాన్ని మోహనుడు ఉగ్గడించిన నిగ్గు శ్లాఘనీయం.

పచ్చగా విలసిల్లుతున్న దేశ ప్రగతి వృక్షాన్ని కబళిస్తున్న పరాన్నభుక్కులైన చీడ పురుగుల పీడను కవి యిలా మన ముందుంచుతున్నాడు.

కాలే కడుపుల మండే గుండెల
సెద దీర్చనివి వగపార్చనివి
పగరగిలించే సెగలెగదోసే
పచ్చని బ్రతుకుల చిచ్చులు పెట్టే
సామాన్యుని పాలిటి సమ్మెట పోటులు
రాస్తారోకో ధర్నా బందులు"

ఇంకా యిలాంటి ఎన్నో వేరుపురుగులు సమాజ శ్రేయస్సును భగ్నం చేస్తున్నాయి. వీటిని అణచివేయాలని కవి ప్రబోధం.

భారత జాతిని బహుథా క్షీణంపజేస్తున్న అస్పృశ్యతను కవి నిరసించిన విధం యిలా ఉంది.

''గాంధీజీ వారసులం......చెప్పుకుంటాం
గాంధేయవాదాన్నే కొంగలా జపిస్తాం
గంటల కొలదీ ఏకబిగిన ఉపన్యసిస్తాం
గరళంలా అంటరాని తనాన్ని మనసున దాచుకున్నాం''

అంటరాని తనాన్ని గరళంలా మనసున దాచుకున్నామని చెప్పడం గొప్పభావన. అంటరాని తనాన్ని పాటిస్తే అది మనసునూ మనిషినేకాక మానవ జాతినే కాల్చివేస్తుంది అనే భావం ధ్వనిస్తున్నది.

"ఏళ్ళు గడచినా - గూళ్ళు కూలినా
కళ్ళు ఎండినా - కాళ్ళు విరిగినా
తోళ్ళు చివికినా - పళ్ళు వూడినా
పేదవాడి స్థానం మాత్రం - ఎక్కడి గొంగళి అక్కడే"

అంటూ పేదవారిని చూసి కవి ప్రకటించిన ఆవేదన గుండెను నీరు చేస్తున్నది.

'దర్పణం' 'ముదిమి' అనే కవితలు కవి ప్రతిభకు దర్పణాలుగా ఉన్నాయి.

'భావి భారతి' 'గాంధీ' 'విజయశీలం' మొదలైన ఖండికలు కవి దేశభక్తినీ, ఆశయాన్నీ వెల్లడిస్తున్నాయి.

సామాజిక స్పృహతో స్పష్టంగా, సూటిగా, సరళమైన శైలితో తనలో చెలరేగే భావాలను ఆవేదనా భరిత స్వరంతో నివేదించిన శ్రీ మోహనమూర్తి బహుధా అభినందనీయుడు ఈ కవి ఇంకా మునుముందు సహజమైన తన భావనాశక్తి సువర్ణమును సానబట్టి, మెరుగుబెట్టి, కాంతిమంతములైన కవితా భూషణాలను సంతరించాలనీ, ఇతోధిక సాహితీ కృషి సాగించాలని మనసార కాంక్షిస్తున్నాను.

వేముగంటి నరసింహాచార్యులు

సిద్ధిపేట

# ఆముఖం

"మరో మొహెంజోదారో", "సిద్ధార్థ", "రుద్రవీణ" వగైరా నాటక, నాటికలలో దాదాపు నాయక పాత్రలు ధరించి రాణించి రాణకెక్కిన మోహనమూర్తి ఏదో "పాంచజన్యం" పేరిట లలితగేయ రచన గావించారని మొదట కనకరాజు గారు చెప్పగా విన్నాను. తీరాచూస్తే ఇది కవితాఖండిక. ఈఖండిక చూశాక మూర్తిగారు కవిత్వం కూడ రాయనారంభించారని తెలిసింది. దానికి యోగ్యతా పత్రం యిమ్మని మూర్తిగారితో పాటు వారి సహచరులు ధర్మవరపు వంశ వృక్షంలో వర్ధిల్లుతున్న నటులు రాంగోపాల్ గారు కూడ వచ్చి అడిగారు. నా యోగ్యతే ప్రశ్నార్థకమైనప్పుడు మోహనమూర్తిగారి కవిత్వ తత్త్వాన్ని తరచిచూసి ఏం యోగ్యతా పత్రమిస్తానబ్బా అన్నాను. ఆఖరికి ఒక సగటు పాఠకునిగా ఈ ఆముఖం.......

మొహమాటం లేకుండా చెప్పాలంటే మోహనమూర్తిలో కవితా మోహనం... ముగ్ధ మోహనమే! ఇంకా అది వికసించవలసి వుంది. "కపితత్వం కపిత్వం" ప్రకారం వ్యంగ్యం (Satire) ఈ ఖండికలోని ఎక్కువ కవితల్లో మనకు కనిపిస్తుంది. "మచ్చలేనిది స్వచ్ఛమైనది, పాలవంటిది, మంచువంటిది, వెన్నెలంటిది జున్నువంటిది"అని 'స్నేహం'లో, ఆనందాలను. విషాదాలను తెలిపే తత్త్వం "పు(గి)ట్టుక" లో ఉంది. "రాజకీయం" విశ్లేషణ దాని రూపు, రుచి, రంగు, వాసన నాడు నేడు బాపుంది.

''వేప పురుగులు'' అనే పెద్ద కవిత మాత్రాఛ్ఛందంలో చాలా బాగా సాగింది.

''పాలిటిక్సులో - పదవాశించి
పకడ్బందిగా - ప్లానులు వేస్తూ
ప్రజానీకమును - పావులు చేస్తూ''

మంచి శబ్దాతో కూడి వుండి చదవటానికి వినటానికి బావుంది.

'స్త్రీ' కవిత మోహనంగా, మనోహరంగా భావకవులను తలపించే విధంగా ఉంది. ''ముద్దు మోమున చిరుదరహాసం ముగ్ధ మోహనం'' అని ప్రారంభించి, మధురాధరములను గులాబి రేకులతో పోల్చిన ఆ రసికతకు జోహార్లు అర్పించాలి.

'నేనెవర్ని' అనే కవితలో ''క్షణికావేశంలో నిండు ప్రాణాలను బలితీసుకోవద్దు, నాకు శాంతి పాఠం నేర్వాలని వుంది'' అంటూ కపోతవిలాపం చేస్తారు. కరుణశ్రీ పుష్పవిలాపానికి ప్రతీక పడుతూ.

''పుట్టిన రోజు''అనే కవితలో పుట్టిన దగ్గర్నుంచి ఒక్కో రోజు చొప్పున గిట్టేరోజు సమీపిస్తుందనే ''వేమన'' సత్యం చెబుతూ సార్థకత, కర్తవ్యాన్ని సందేశంలా గుర్తు చేశారు మనకు.

మొత్తం మీద కవిత్వం బాపుంది. ఇంకా అక్కడక్కడ వున్న గ్రాంథికశైలి, గంభీరంగా సాగిన తీవ్ర, కొంత సంప్రదాయ వాసన నుంచి "మోహనమూర్తి ది పోయెట్" ఇంకా కొత్త దారులు తొక్కాలి. తెలుగు సాహిత్యంలో అనేక ప్రక్రియలున్నాయి. "కవిత్వం" వాటిల్లో ఒకటి. ఇప్పటికే నాటక కళను ఆశ్రయించిన మోహనమూర్తిగారు కవితాశ్వం కూడ అధిరోహించారు కాబట్టి జోడు గుర్రాలపై స్వారీ జైత్ర యాత్రలకు దారితీసి విజయోత్సవాలకు పరిణమించాలని ఆశిస్తూ అభినందిస్తున్నాను.

18-7-1990 జె. చెన్నయ్య

సంగారెడ్డి. (జర్నలిస్టు)

# స్నేహోపహారం

శ్రీ మోహనమూర్తిగారు వారి కవితల సంపుటికి అభిప్రాయం వ్రాయమనడం వారికి నాయెడలవున్న స్నేహభావమే కారణం. ఈ సంపుటిలో 'స్నేహం' ఒక కవితా ఖండిక. దాన్ని చదివితే స్నేహమెంత ప్రియమైనదో తెలుస్తుంది. స్నేహంతోనే సర్వం సమకూరుతుంది. అది అద్భుతప్రాయమైనది. సర్వకాల సర్వావస్థలయందు స్నేహితుడే గతి. కిష్కింధలో వాల్మీకి అంటాడు గదా,

"ఆఢ్యోవాపి దరిద్రోవా, దుఃఖితః సుఖితోపివా,
నిర్దోషోవా, సదోషోవా, వయస్యః పరమాగతిః

ఇది అచ్చమయిన స్నేహలక్షణం. స్నేహంలాగా కనిపించేది ఒకటుంది. అది షరతులతో కూడినది. వాలీరావణుల స్నేహం అటువంటిదే. "దారాఃపుత్రాః పురం రాష్ట్రం, భోగాచ్ఛాదన భాజనం, సర్వమేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర" ఇది సంధికుదుర్చుకున్న బాపతు. దీని వెనుక విద్వేషం వున్నది. అవిశ్వాసం ఉంది.

స్నేహం అంతరించిపోతోందే అన్న 'తపన' ఈ రచయితచేత రచన చేయించింది. కవిత్వానికి తపన లేదా వేదన భూమిక. "కవిత్వం" అదే శీర్షిక కింద "ఇంతకీ కవిత్వమంటే ఎలావుంటుంది"? అని తనకు తానే ప్రశ్నించుకున్నారు రచయిత. కవిత్వమంటే ఏమిటి? - అన్నదానికి ప్రాక్పశ్చిమ పండితులనేక రకాలుగా సమాధానమిచ్చారు వాళ్ళ అనుభవాల ఆధారంగా. ఒక సందర్భంలో 'సెయింట్ ఆగస్టిన్' అంటాడు. "మీ రడక్కపోతే నాకు తెలుసు, అడుగుతున్నప్పుడు నాకు తెలియదు" అని. చెళ్ళ పిళ్ళవారు కుడా "ఏది కవిత్వం కాదో మీరు చెప్పండి, అప్పుడు కవిత్వం అంటే ఏమిటో నేను చెప్తాను" అన్నారట అడిగిన వాళ్ళతో. బేకన్ "Some Shadow of Satisfaction to the mind of man in those Points, Where in the nature of things doth deny it"—. కవి. కవిత్వంలో తన వేదనని ప్రకటిస్తాడు. ఆ ప్రకటనలో ఒక చమత్కారముంటుంది. ఆచమత్కారం వల్లనే ఆనందం కలుగుతుంది. కవికీ శ్రోతకీ కూడా చమత్కారమే సౌందర్యం, సౌందర్యమే అలంకారం. "సౌందర్యంచ చమత్కృత్యాధాయ కవిత్వం, చమత్కృతిరానంద విశేషః సహృదయ హృదయ ప్రమాణకః" అని అన్నాడు జగన్నాధుడు. శ్రోత ఆనందించడమే కవిత్వానికి పరమావధి.

కావ్యానికి ఆనందోపదేశములు, సమాజ శ్రేయస్సు పరమ ప్రయోజనములు. కవిత్వానికి జన్మస్థానం అనుభూతి. అనుభూతి అంటే కేవలం Feeling కాదు. Perfect Sensibility. రంగులూ కుంచెలూ వున్నంత మాత్రాన అందరూ బొమ్మలు గీయలేరు. సరిగమలకర్థం తెలిసినంత మాత్రాన సంగీతం వచ్చినట్టుకాదు. అట్లాగే అనుభూతిని పొందిన ప్రతివాడూ కవికాలేడు. కవి ద్రష్ట. ఆయన దర్శించిన దానిని ఊహలలో ఊగించి, ఆలోచనలతో లాలించి, భావంగాపాలించి శ్రోతకు లేదా పాఠకుడికి ప్రకటిస్తాడు. ఈ దర్శనానికి ప్రదర్శనానికి మధ్యజరిగే వాగ్వ్యాపారమే కవిత్వం. కవికి మాటలు తప్ప వేరే ఉపకరణాలు లేవు. ఏ శబ్దం తాను అనుకున్న భావాన్ని సూటిగాకాక సుష్టుగా, శోభాయమానంగా మోసుకొని రాగలదో. ఆ శబ్దాన్ని ఏరుకోవడంలో కూడా కవి జాగ్రత్తపడాలి. The right word, in the right Place'' అంటే అర్థం అదే కదా!

కవిత్వం లయబద్ధంగా ఉంటే బాగుంటుందని చాల మంది కవి పండితుల అభిప్రాయం. "కవిత్వం ఛందోబద్ధం అయి ఉండాల్సిసిన అవసరంలేదు అని లేహంట్, కోల్‌రిడ్జ్ మొదలయిన వారన్నారు". ఛందోబద్ధమైవుంటే వినటానికి ఇంపుగా వుంటుంది. లయ లేకపోతే శ్రోత కాభిముఖ్యం కలగడం కొంచెం కష్టమే. ఛందస్సున్నా దాంట్లో కవిత్వం లేకపోవచ్చు. ఛందస్సులో వున్న

సంగీతమే కవిత్వమన్న భ్రాంతి కల్గించవచ్చు. కవిత్వం వున్నా ఛందస్సు లేకపోవచ్చు. కనుకనే కవిత్వమంటే "Musical as well as magical thought" అని చెప్పాలి. చెప్పటం చేతకాకపోతే అది కవి లోపం, అర్థం చేసుకునే శక్తి లేకపోతే అది శ్రోత లోపం. "వేళ్ళు కాళ్ళయి నడిచే, చెట్టు మనిషి, చేట్టునై పుట్టినా బాగుండేది— ఏడాదికి ఒక వసంతమాన్నాదక్కేది— మనిషినయి పుట్టి అన్ని వసంతాలు కోల్పోయాను". (ఆధునిక మహాభారతం— శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ) ఇందులో మొదటి వాక్యాన్ని మినహాయిస్తే— మినహాయించినా పెద్ద ప్రమాదం ఏమీలేదు. తక్కిన దాంట్లో లయవున్నది. "వసంతం సౌఖ్యానికి, కొత్తదనానికి ప్రతీక" ఈనాటి మనిషి ఎంతటి నికృష్టదశలో వున్నాడో చివరి వాక్యం చెప్తుంది. ఇది ఉత్తమ కవిత్వం. "నేను సిగిరెట్లు కాలుస్తున్నాను". అనే మామూలు వాక్యాన్ని 'సిగిరెట్లు నన్ను కాలుస్తున్నాయి' అని చెప్తే అది కవిత్వం. అవే మాటలు స్థానం. రూపం మార్చు కోవడం వల్ల ఒక విధమయిన చమత్కారం కల్గుతోంది.

ఒక రాజకీయ సిద్ధాంతం సాహిత్యంలో చోటు చేసుకోవల్సిన అవసరంలేదని నా అభిప్రాయం. అయితే నేటి రాజకీయాలు దురదృష్టవశాత్తు సమాజంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. సమాజం కలుషితమై పోయింది.

సమాజంలో ఒకడైన కవి ఈ పరిస్థితిని తట్టుకోలేక పోతున్నాడు. అందుకనే ఈనాటి క్రొత్త కవిత్వంలో పైకి నేటి రాజకీయాల సిద్ధాంతాలు కనబడుతున్నట్లున్నా అట్టడుగున సమాజశ్రేయస్సుకై కవిపడే వేదన కూడా కనపడుతుంది. విచిత్రమేమిటంటే వేదన నుండి పుట్టిన కవిత్వం కవికీ శ్రోతకూ కూడా వేడుకనే కలిగిస్తుంది. విశ్వశ్రేయస్సుకు బాటవేస్తుంది. అదే రహస్యం.

వెలుతురు కోసం తపించి కవిగా వెలుగులోనికి వస్తున్న మిత్రులు శ్రీ మోహనమూర్తిగారికిది నాస్నేహోపహారం.

ఇ తి శ మ్

20-7-1990 ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి

M.A., B.Ed.


సాహిత్యరంజని
1-5-28, బ్రాహ్మణవాడ,
సంగారెడ్డి - 502 001.

బి. బాలక్రిష్ణయ్య
ప్రధాన కార్యదర్శి

రాష్ట్రోపాధ్యాయ సంఘం ఆం. ప్ర.
3-2-798, కాచిగూడ,
హైదరాబాద్ - 500 027.

# సందేశము

మిత్రులు శ్రీ నెమ్మాని మోహనమూర్తి గారు వంపిన పాంచజన్యము వచనగేయ సంపుటిని చదివాను. చక్కటి కవితా ధోరణితో భావాలతో రచయితగారు విస్తృత భావనా ప్రపంచమును చదువరుల ముందుంచారు. వీరు చక్కటి నటులు. ఇంకా అనేక రంగాలలో వీరికి ప్రవేశము కలదు. వీరు సర్వతోముఖా-భివృద్ధిని సాధించాలని నా ఆకాంక్ష. వీరు ఇంకా అనేక సాహితీ ప్రక్రియలలో రచనలు సాగించి తెలుగు సరస్వతికి సేవలందించాలని మనఃపూర్తిగా కోరుచున్నాను.

23-7-1990

సం/
బి. బాలక్రిష్ణయ్య

# నా మాట

కవిత్వం వ్రాయాలని నేనెన్నడూ అనుకోలేదు. నేను వ్రాసింది కవిత్వం అవునో, కాదో నాకు తెలియదు. ఎందుకంటే నేను కవిని కాను కాబట్టి! కేవలం వాడుక భాషలోనే నాభావాలను కాగితంపై పెట్టాను. వాటిని చదివిన స్నేహితులు, హితులు బాగున్నాయన్నారు. కొందరు యిలా వుంటే బాగుంటుందన్నారు. నాలోని నటుడు(?) అక్కడక్కడా తొంగి చూశాడని కొందరు— అధిక శాతం కవితలు నా జీవన సరళికి ప్రతి బింబంగా వున్నాయని మరి కొందరు అన్నారు. ఏది ఏమైనా నాలోని భావాల ముడి పదాలు అచ్చయి అక్షర రూపంలో అందరి ముందుకు రావడం నాకమితానందం!

అయితే ఈ అచ్చొత్తిచ్చే కార్యక్రమంలో వెనుదన్నుగా వుండి, నాకు ప్రోత్సాహమిచ్చిన మిత్రులు, నాబహిఃప్రాణాలు— శ్రీ ధర్మవరపు రాంగోపాల్ మరియు శ్రీ బి. కనకరాజు గారలకు సర్వదా కృతజ్ఞుడను. వారికి యింతకన్నా పొగడ్తలనంటగట్టను. ఎందుకంటే వారి కృషిని చెప్తే పొగడ్త అవుతుంది— వారిని పొగిడితే నన్ను నేనే పొగుడుకున్నట్టు కనక.

సహృదయులు. గౌరవనీయులు, జిల్లా కలెక్టరు శ్రీమతి లతాకృష్ణారావు I.A.S. గారు జిల్లా పరిపాలనా కార్యక్రమంలో తలమునకలై వున్నా . నా అభ్యర్థనను మన్నించి, తమ సందేశం

అందివ్వటం నాఅదృష్టంగా భావిస్తున్నాను—అలాగే నిష్కల్మష హృదయులు, నిరాడంబరులు, జిల్లా ప్రజా పరిషత్తు అధ్యక్షులు, మా మైత్రేయ కళా సమితి గౌరవాధ్యక్షులు శ్రీ డి. రామకృష్ణగారు, యింకా కళాపోషకులు, కారుణ్యచిత్తులు, సినీనిర్మాతలు. మా మైత్రేయ కళా సమితి ముఖ్య సలహాదారులు రామచంద్రపురం మండలాధ్యక్షులు శ్రీ వి. భూపాల్‌రెడ్డి గారలు అందించిన అభయాశీర్వాదాలకు, వారి మంచితనానికి నా కైమోడ్పులు. చక్కని విమర్శకులు, మంచితనం కలుపుగోలు స్వభావాల వ్యక్తి ఆదరణీయ మూర్తి, జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ పెంచలయ్య గారికి నావందన చందనాలు.

నా కవితా సంపుటిని ఆమూలాగ్రంగా చదివి, వాటిలోని లోటుపాట్లను సహృదయంతో మన్నించి, చక్కని సూచనలతో, విజ్ఞానదాయకమైన పీఠిక వ్రాసిన సత్కవులు, గురుతుల్యులు, శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి గారికి, నాకవితలలో నా వేదనని సహృదయముతో అర్థం చేసుకుని "నాదవేదన" ని అందించిన కవిద్రష్ట, నిర్మల హృదయులు, సాహితీ వికాస మండలి, సిద్దిపేట, అధ్యక్షులు, పూజ్యులు శ్రీ వేముగంటి నరసింహాచార్యుల గారలకు ఎంతైనా ఋణగ్రస్తుడను. చతురులు, కార్యశూరులు, యితరులను నొప్పించని సహృదయులు, అజాతశత్రువులు, రాష్ట్ర ఉపాధ్యాయ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ బి. బాలక్రిష్ణయ్యగారికి, సాహిత్యంలో చక్కని ప్రవేశం కలిగిన స్నేహశీలి, జర్నలిస్టు, మంచి మిత్రులు శ్రీ జె. చెన్నయ్య (ఈనాడు) గారికి, నా నమస్సుమాంజలులు.

ఇంకా నాకు ప్రోత్సాహమిచ్చిన నా మిత్రులు శ్రీ డి. శశిధర్‌రావు(SBI), శ్రీ యన్. శివన్నారాయణ(A.S.T.T.) శ్రీ వి. వి. యస్. సూర్యనారాయణ ( Dist. Telegraphs ), గారలకు, చివరిగా నా మంచిచెడులను గమనించి, నా అభివృద్ధిని సదా ఆకాంక్షించే నా''హన్మంతు''గౌడులకు నా ప్రత్యేక కళాంజలులు.

నా పాంచజన్యాన్ని అనుకున్న సమయానికి,అనుకున్న దానికంటే అందంగా అలంకరించి, మెరుగులుదిద్ది, ముద్రించి, ఆకట్టుకునే విధంగా తయారు చేయటానికి శ్రమించిన శ్రీ శ్రీనివాస ప్రింటర్స్ అండ్ బైండర్స్ అధినేత శ్రీ పి. ముత్యాల్‌రావుగార్కి, వారి సిబ్బందికి నా ధన్యవాదాలు.

నా యీ కవితా సంపుటిలో ఏదైనా లోటుపాట్లుంటే, సహృదయంతో మన్నించాలనీ, నాకవితల ద్వారా ఎవర్నీ నొప్పించాలన్న ఉద్దేశ్యంలేదనీ ఒకవేళ ఎవరికైనా బాధకలిగించే అంశంవున్నా మన్నించాలనీ కోరుకుంటూ ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు అర్పించుకుంటూ,

మీ

నెమ్మాని మోహనమూర్తి

# అంకితం

నా జన్మ కారకులు - జననీ జనకులు



కీ॥ శే॥ నెమ్మాని అనంత రామమ్మ, బాపూజోషీగార్ల

పవిత్ర పాదపద్మాలకు సజలనయనాలతో

నెమ్మాని మోహనమూర్తి



# సరస్వతీ ప్రార్థన

అక్షర రూపిణీ అభయ ప్రదాయిని
విద్యా దేవత వీణాధరే
అమృత వర్షిణీ అఖిలాండేశ్వరి
మునివృందనిషేవిత వాణీనుతే
శారద భారతి శ్రీమహాలక్ష్మి
శ్రీ లలితాదేవి నమోస్తుతే
జయ జయహే శ్రీ వాసర నిలయిని
వాసవి భగవతి నమోస్తుతే!

# స్నేహం

అది ఆశించదు ఏ ప్రతిఫలం!
నిస్వార్థం - నిత్యనూతనం!!

లొంగదు ఏ ప్రలోభాలకు
అమ్ముడుబోదు యితరులకు!!

అసత్యాలకు అతిదూరం
లోకమందున మృదు మధురం!!

లేమి ఎరుగనీ ఈ కలిమి!
మానవులకగుపించని బలిమి!!

పరుషమెరుగదు అతిలలితం!
నవ్యజీవనం - అమూల్యం!!

తల్లీబిడ్డల అనుబంధం!
దేవుడి భక్తుల సంబంధం!!

సహృదయులకు చక్కని వరము!
గతులు తప్పెనా దుర్భరము!!

మనసులు కలిసిన స్నేహితులు
పాలు తేనెలు - చమురూ వత్తులు!!

మధురమైనది పవిత్రమైనది
మచ్చలేనిది - స్వచ్ఛమైనది!!

పాలవంటిది - మంచువంటిది
వెన్నెలంటిది - జున్నువంటిది!!

మల్లెల జల్లులు - పిల్ల తెమ్మెరలు
కురుపించే మకరందపుసోనలు!!

మరపురానిది ఆ స్నేహం!
మైమరిపించే సుస్నేహం!!

అమృతతుల్యము ఆ స్నేహం!
ఆస్వాదింతును నిరంతరం!

# "నాలో"

నా హృదిలో చెలరేగుతున్నవి బడబాగ్ని కీలల వేడిసెగలు!
మంచిని సమాధి కడుతున్న వంచననుగాంచి
నా మదిలో ఉప్పొంగుతున్నవి ఉబికిరాలేని మూగరోదనలు!!
నిత్యం నిజాన్ని దిగమింగుతున్న అసత్య ప్రవచనాలనుగాంచి
నీతి నియమాలను నిట్ట నిలువునా అధః పాతాళానికి
అదుముతున్న నయవంచక కీచకులగాంచి
నా హృదిలో చెలరేగుతున్నవి బడబాగ్ని కీలల వేడిసెగలు!!
నిజాయితీని కంచమంచున నంజుకు తింటున్న
బకాసురుల దౌర్జన్య పర్జన్యములగాంచి
నా మదిలో ఉప్పొంగుతున్నవి ఉబికిరాలేని మూగరోదనలు!!
అబల ఆర్తనాదాలను సుస్వర మంగళారావాలుగా
విని మురిసిపోతున్న కామాంధుల కర్కశ హాసములగాంచి
నా హృదిలో చెలరేగుతున్నవి బడబాగ్ని కీలల వేడిసెగలు!!
నడిబజారులో అపరమన్మధుడి పోకిరి పోజులతో
అబలల నల్లరిపెట్టె అష్టావక్రి ఏబ్రాసులగాంచి
నా మదిలో ఉప్పొంగుతున్నవి ఉబికిరాలేని మూగరోదనలు!!
ఎదుటివారిని వెర్రి వెంగళప్పలుగా జమకట్టి చెవులోపూలుపెట్టె
శుంఠాగ్రేసర, వాచాలుర బీరాలాపములగాంచి
నా హృదిలో చెలరేగుతున్నవి బడబాగ్ని కీలల వేడిసెగలు!!
విశృంఖల విహారంచేస్తున్న ఘోరనేరాలను ఎదుర్కోలేని
జాతి అశక్తతను, పిరికితనాన్ని తలచుకొని
నా హృదిలో చెలరేగుతున్నవి బడబాగ్ని కీలల వేడిసెగలు!
నా హృదిలో ఉప్పొంగుతున్నవి ఉబికిరాలేని మూగరోదనలు!!

## సున్నా

ఎదుటివారి ఎదలోతుల్లో
తరచిచూసి ఎటువంటి వారో
తెలుసుకుందామని
తపనచెందే నేను-
నన్ను నేను తెలుసుకోలేని
నిరర్థక జీవిని!
నిండు సున్నాని!!



## పు(గి)ట్టుక

కాలవాహిని గమన చక్రంలో
కర్మ సిద్ధాంతాన్ని గమనిస్తే
కన్ను తెరెస్తే - ఆనందాల పుట్టుక!
కన్ను మూస్తే - విషాదాల గిట్టుక!!



# కాలచక్రం

కదలి ఎండే వీలున్నది
మిన్ను విరిగే వీలున్నది
మృతుడు బతికే వీలున్నది
హిమనగం కృంగే వీలున్నది
లావా నీరయ్యే వీలున్నది
నీరు నిప్పయ్యే వీలున్నది
కాని.........
వీలుకానిది - అలవికానిది
అనితరమైనది - అసాధ్యమైనది
కాలగమన చక్రాన్ని
కదలకుండా ఆపడమన్నది!



# తిరగబడ్డ ఆయుధాలు!

భగవాన్! ప్రసాదించు
భస్మాసుర హస్తం!
భస్మీపటలం చేస్తాను,
భయంకర దారిద్ర్య రాక్షసిని!
దేవా! నాకు అనుగ్రహించు
దేవేంద్రుని వజ్రాయుధం!
ధరనువీడి గగనంలో ఎగిరే
ధరల రెక్కలు నరుకుతాను!
నారాయణా! నాపరం చెయ్యి
నిగ్గు దేలిన చక్రాయుధం
నిర్జన నిశీధిలో ఉత్తరిస్తాను
నిరుద్యోగ భూతకుత్తుకను!
అయ్యయ్యో! ఇదేమిటి స్వామి
అదృశ్యమైనాయి ఆయుధాలు!
అంకితమాయె రగుల్చు
హస్త మహిమ!
అష్టదారిద్ర్య రాక్షసి
'హస్త'గతం!
మొక్కవోని ఆ వజ్రాయుధం
మొక్కుతుంది ధరల పాదాలకు

# విజయం శీలం

సైనికా! వీర సైనికా!!
దుండగుల బారినుండి
దేశ రక్షణకై, అప్రమత్తంగా
మంచు చరియల అంచుల్లో
మరతుపాకుల సాంగత్యంలో
నిర్జన వన సీమల్లో
నిరంతరం, నిద్రిమాని,
ఆలుబిడ్డలకు, ఆత్మీయులకు
అతిదూరంగా,
దేశ రక్షణే పరమావధిగా,
ఆకలి దప్పులనధిగమించి
మేమంతా నిశ్చితిగా
మైమరచి నిద్రించుటకు
జీవితాన్ని పణంగా పెట్టిన
అరివీర భయంకరా!
జై జవాను! నీకు జోహారు!

నీ రక్షణలో నిర్భయంగా
నిరంతరం సుఖశాంతులతో
విలసిల్లే దేశవాసులు
తలచెదరా నిను కలనైనా?
కనిపించని దేవుళ్ళకు
కనికరంలేని నాయకులకు

నిత్యం జరిగే పూజా సత్కారాలలో
నూరోవంతైనా దక్కునా నీకు?
దేశాన్ని కాపాడే ధన్యజీవి!
ధైర్యసాహస వీర కుమారా!
నీనీడన బతికే మేము
నిన్ను గురించి ఆలోచిస్తామా?
నిస్వార్థ పరోపకార చిత్తా!
నీకిదే నా జోహారు—



# దర్పణం

దర్పణం చూసి నీదర్జా తెలుసుకో
"అద్దానిది" నీముందు నీమాటని గ్రహించుకో
దర్పణంలా ఎవరి ముందు వారి మాట
దరువేస్తు ఆడకు బతుకులతో సయ్యాట.



# గాంధీ!

గాంధీ! నీవు మళ్ళీ పుట్టాలనీ
గొంతెమ్మ కోరికలు కోరుతూ
మహాజన సముద్రాన
గంభీర ఉపన్యాస విన్యాసాలు!
బాపూ! నీవు నాటీపెంచి
మహావృక్ష రాజమవ్వాలనీ
పది మందికీ నీడనివ్వాలనీ
పూతకాతలతో విరియాలనీ
మాచేతికిచ్చిన ఈదేశ
స్వాతంత్ర్య చిరుమొలకను,
మత మౌఢ్యాలతో
ప్రాంతీయ ద్వేషాలతో
వికృత వికటాట్టహాస ఉగ్రవాదంతో
ముక్క చెక్కలు చేయబూని
చతుర్దశవత్సరాల
ఆమహా వృక్షాన్ని
శకలాలుగామార్చి,
ఇంటి దూల వాసాలకు
వంట చెఱకుకు
ఆకును కరివేపాకులా వాడుతూ
మాస్వార్థ పరత్వాన్ని
నిరూపించుకుంటున్న తరుణంలో

నీవు మళ్ళీ పుట్టి శకలాలను
చేర్చి, కూర్చి చిగురింప జేయగలవా?
బాపూ! మాస్వార్థ సంకుచిత భావాలను
మది నుండి మాయం చేయగలవా?

ఈ దేశవాసులు నీ వారసులు
మత్తుమందు గమ్మత్తులో
మందుమత్తు గమ్మత్తులో
మనీకి-షీకి దాసులై
దేశాన్ని, దేశరహస్యాలను
మ్లేచ్ఛులకు తాకట్టు పెట్టు దుస్థితిలో
నీవు మళ్ళీ పుట్టగలవా?
మత్తుగమ్మత్తును చిత్తు చేయగలవా?
మాకున్న బుద్ధిని, కుసంస్కారాన్ని
కూకటి వేళ్ళతో పెకలించ గలవా?

సత్యంవదా, ధర్మంచరా, మారిపోయి
సత్యంవధ, ధర్మంచెఱ పాలయ్యింది బాపూ!
ఈ దేశంలో జరుగుతున్న ఘోరనేరాలను
మానభంగ దురంతాలను
దివి నుండి చూస్తూ, గుండెలుబాదుకొంటూ
నాదేశాన్ని కాపాడు కొవాలని తహతహతో

మళ్ళీ పుట్టాలని కోరుకోకు
ఏ మందుకూ లొంగని క్యాన్సర్‌లా
నయంకాని ఎయిడ్స్‌లా
అణువణువునా విస్తరించి
మురికి కూప మయ్యిందీ దేశం!
నీచల్లని స్పర్శతో, ఈ జాడ్యాలను
నిర్వీర్యం చేయాలని ప్రయత్నించకు
కోరికోరి పొరపాటుకు పాల్పడకు
గాంధీ! నీవు మళ్ళీ పుట్టకు
ఏ పొరపాటుకు పాల్పడకు!



# సప్తరత్నాకరమం

అలుముకొంది అంధకారం
అస్పృశ్యత రూపంలో
అఖండ భారతిని అపహసించే
అహంకారుల గుండెల్లో!

ఎక్కడున్నాం మనం? ఆలోచిస్తే...
నిలబడ్డాం అథఃపాతాళం అంచున
చిక్కుకున్నాం మనకు తెలియకనే
అస్పృశ్యతా రాక్షసి కబంధ హస్తాన!

గాంధీజీ వారసులం...చెప్పుకుంటాం!
గాంధేయ వాదాన్నే కొంగలా జపిస్తాం!
గంటలకొద్దీ ఏకబిగిన ఉపన్యసిస్తాం!
గరళంలా అంటరాని తనాన్ని మనసున దాచుకున్నాం!

పశువులకు తమ జాతి మీద మమకారం
పక్షులకు తమ వారిపైన మమతానురాగం
పంచముల్లో ప్రవహించేది కాదా రుధిరం
పవిత్రులు కాదని వారికేల ముద్ర వేసిందీ సంఘం?

"హరి" అని నారాయణుని ధ్యానిస్తాం!
"మాల"ను అతని మెడలో వేసి పూజిస్తాం!
"హరిజను"ని అంటరాదని అంటుంటాం!
"మాల"ను దరికి రావద్దని కించపరుస్తాం!

హరికి హరిజనునికి ఉన్న సంబంధం
మాలకు మాధవునికీ ఉన్న అనుబంధం
మరచి చేసుకుంటున్నాం మనసుని పాప పంకిలం
మహాత్ముల్లా నటిస్తూ చరించే నటులం!

మహోత్కృష్టమైనది, మానవ జన్మము
మేలుచేయి పరులకు ఆ-బతుకుధన్యం
మనసు నుండి తుడిచివేయి అంటరానితనం
మనమంతా ఒకటైతే దేశప్రగతి తథ్యం!



# రా(క్షసీ)జకీయం

విశ్లేషణం

"రా" శబ్దం రాక్షసాంశమనుకుంటే
"జ" శబ్దం జనుల హింస అనుకుంటే
"కీ" శబ్దం పైవాటికి తాళం చెవి అనుకుంటే
"య" శబ్దం యమపురిని మరిపించేదనుకుంటే
"ము" శబ్దం మురికి కూప జీవనుకుంటే
వెరసి అవుతుంది నేటి రాజకీయం।
చేస్తుంది భావి భారతిని అస్తవ్యస్తం।

ఈనాడు

మాట తప్పుట రాజకీయం
మంచి మరచుట రాజకీయం
నీతి వదులుట రాజకీయం
మమత నమ్ముట రాజకీయం
ఓట్లు గుంజుట రాజకీయం
సీట్లు పొందుట రాజకీయం
విలువలుడిగిన రాజకీయం
విత్తమార్జన దీని ధ్యేయం

## అర్హత

గాంధీయిజం వల్లించగలవా?
గుండాయిజం చెలాయించగలవా?
ప్రజలను ప్రలోభ పెట్టగలవా?
అరచేత స్వర్గాన్ని చూపెట్టగలవా?
ఆడినమాట నిర్లజ్జగా తప్పగలవా?
నమ్మిన వారిని నట్టేట ముంచగలవా?
అవసరానికి హత్యలైనా చేయించగలవా?
అవలీలగా పార్టీలు ఫిరాయించగలవా?
అయితే రాజకీయ పరమ పదసోపానంలో
వంటగడిలో వెలుగుదువురా!

## స్వరూపం

నీతి నీతంటూ అవినీతిని భుజిస్తూ
నిజాయితీని భూస్థాపితం చేస్తూ
న్యాయదేవతని నగ్నంగా పరాభవిస్తూ
అన్యాయాన్ని అందల మెక్కిస్తూ
దుర్మార్గాన్ని దుస్తులుగా ధరిస్తూ
గోముఖ వ్యాఘ్రంలా భరిస్తూ
జనుల-ఛీ, థూలను చిర్నవ్వుతో భరిస్తూ
సంచరించితివా నీ-గెలుపుతథాస్తు!

ఆకాంక్ష

ఓ భారత రాజకీయ సోదరా!
ప్రజల కష్టానష్టాలను గమనించు
నివారణోపాయం ఆలోచించు
అవినీతి పరుల ఆట కట్టించు
ముందునీవు నిజాయితీగా వ్యవహరించు
విద్యాధికుల, మేధావుల గౌరవించు
వారి పరిశోధనా ఫలితాల దేశానికందించు
స్వదేశీ విజ్ఞానాన్ని పెంపొందించు
విదేశీ విజ్ఞాన మోజుని మొదటికి-తుంచు
వన్య వృక్షసంపదను పెంపొందించు
భూ, జల, ఖనిజ వనరులనాన్వేషించు
దేశాన్ని సశ్యశ్యామలం గావించు
దారిద్ర్య రాక్షసిని పొలిమేరల దాటించు
దేశాన్ని పాడి పంటల నిలయం గావించు
భారతమాత గౌరవాన్ని ఇనుమడించు
జనులందరు కీర్తింతురు జైజై అటంచు



# వృద్ధాప్యం

ముదిమి ముసిరిన జీవితాలు
పట్టు తప్పిన అవయవాలు
మందగించిన వీక్షణాలు
భేరిచెడిన కర్ణపుటములు
శక్తి వుడిగిన శరీరాలు
నడక మరచిన పాదయుగము
సాటివారి జాలిపలుకులు
నోచుకోని "జరా" చరులు!

దైవమిచ్చిన తెలివి తేటలు
పెంచుకున్న కండ బలములు
కూర్చుకున్న అర్థ బలములు
నేర్చుకున్న మంచి చెడ్డలు
పంచి యిచ్చిన కన్నవారికి
ఛీదరింపులు ఛీత్కారాలు!

నలతపడితే కలతపడి-నీ
కలలు నిజమొనరించినట్టి
ధరాతలమున దైవరూపులు
ప్రాయముడిగి శక్తి సడలి

నేలబడితే, కూలబడితే
ఆర్తిచే నీకాశపడితే
ఛీత్కరింతువా సోదరా
చీదరింతువా తమ్ముడా!

జన్మనిచ్చి నడకనేర్పి
కూర్మి పేర్మిమి ఉగ్గుపెట్టి
నలుగుపెట్టి లాలపోసి
లాలిపాడి నిదురపుచ్చి
పెంచి నిన్ను పెద్ద చేసిన
ముదిమి ముదిరిన త్యాగ మూర్తుల
ఆదుకుంటే ధన్యుడవురా
కాదనంటే వ్యర్థుడవురా!

ముసలి తనము ఆవహించని
జీవి కలదా జగతిలోన
ముందుకైనా నీవు కూడా
ముదిమిసోకి కూలబడవా
నీదు వయసున వృద్ధ జీవుల
ఆదుకుంటే మానవతరా
నీదు భావి బతుకునకు
అది దోచలేని పెట్టుబడిరా!



# వేరుం పురుగులుం

కాలే కడుపుల - మండే గుండెల
సెదతీర్చనవి - వగ పార్చనవి
వగ రగిలించే - సెగలెగదోసే
పచ్చని బతుకుల - చిచ్చులు పెట్టే
సామాన్యుడి పాలిట - సమ్మెట పోటులు
రాస్తారోకో - ధర్నా - బందులు!

తమ ప్రాభవము - తమ అతిశయము
నిలుపుకొనుటకై - ఎత్తుల జిత్తులు
పాలిటిక్సులో - పదవాశించి
పకడ్బందిగా - ప్లానులు వేస్తూ
ప్రజానీకమును - పావులు చేస్తూ
పబ్బము గడిపే - పరాన్నభుక్కుల
నిరశన వ్రతాలు - నిరాహార దీక్షలు!

ప్రభుత ఆస్తులు - ప్రజా ధనమని
ప్రగల్భాలు లెస్సగ పలుకుతూ
ఉద్యమం పేరిట - ప్రజా ఆస్తులను
అగ్నిహోత్రినికి - ఆహుతిచేస్తూ
పీడిత తాడిత జనోద్ధరణకు

మకరాశ్రువులు - రాల్చేనేతల
నిరశనహోరులు - ధర్నాబందులు!
సమ్మెపోటులు - గృహదహనాలు!!

కూలికడుపున - మట్టినికొట్టి
ప్రయాణీకులను - మార్గ మధ్యమున
తిండికి దప్పికి - తిప్పలు పెట్టి
రోగగ్రస్తులకు - ఔషధలేమితో
ప్రాణాలకు బహు - సంకటమేర్పడ
దినసరిబత్తెం - దొరుకుట మృగ్యం
అందోళనలు - విజయవంతమని
ఎదరొమ్ములను విరగదీసుకొని
వెర్రి కేకలతో - చిందులు వేసే
మృతనష్టపు బుద్ధికి స్వస్తి పలికిన
జన సామాన్యము జైజై అందురు!

వక్రమార్గమును - విడువక మీరు
ఎదుటి వారిపై - నిందలువేస్తూ
నిజాయితీని - నిలువున చీల్చి
దేశ ప్రగతనే - కల్పవృక్షమును
వేరు పురుగులై తొలిచే వైనం
మానకపోతే - అధోగతి తథ్యం!

భవితవ్యమున "బందు"లు బందు
"ధర్నాల"ను దరిజేరనీయక
"రాస్తారోకో" ఆలోచనలకు
సమాధి మీరు కట్టకపోతే
మార్జాలము సైతము మృగరాజగును
గొఱ్ఱెదాటుడు ఈ జనావళి
ఏమిచేయునని మొరాయించితే
ఎర్రిగడ్డకూ - ఎగుమతి చేసి
పుర్రె గుణమునూ సవరించెదరు
ప్రచండ మారుత ప్రభంజనాలై
జనవాహిని నిను ముంచివేయును
ప్రజాశ్రేయమే - మనకు హితమని
వారి సుభిక్షమే - మనకు రక్షయని
తలపోయుమురా - భారత సోదరా!



# భావి భారతి

భావి భారతి భవిత పరికించి చూడ
భారమాయెను హృదయమ్ము బాధతోడ
భయముతో పాదాలు వణుకుచుండ
భాష కరువాయె మేధస్సు మొద్దుబారె!

రాజకీయ చదరంగ పందెమందు
బొంకు నేర్చిన నాయక కుళ్ళుబుద్ధి
రాటుదేలిన స్వార్థపు మోసబుద్ధి
రామార్పణము కాగ భారతి మోదమందు!

కులమతాల ఊబిలో కూరుకుపోయి
కక్షగట్టి అమాయకుల కాల్చిచంపు
కఠిన పాషాణ హృదయులు మార్పుచెంది
కరుణచూపిన, భారతి మోదమందు!

పొరుగువారి కుతంత్రాల ఉచ్చుచిక్కి
పరమపావని భారతి యెదను చీల్చి
పారురుధిరాన ముదముగ స్నానమాడు
పరమనికృష్ట దృష్టిని పారద్రోల,
తల్లి భారతి నిజముగ మోదమందు!

మనీ-షీల మత్తులో మధువుగోలి
మాతృగడ్డను గుడ్డలా అమ్మబోక
మర్మముల పిక్రియించు నీచాతి నీచబుద్ధి
మదిని వీడిన భారతి మోదమందు!

దేశ రక్షణాయుధాల దౌత్యము నెరపి
దండిగా లంచాల కాశపడక
ధరను నీ జాతి గౌరవము ఋనుమడింప
దౌర్భాగ్యమును వీడు భారతి మోదమందు!

కట్నాల సంతలో పశువుగా మారి
కన్నె కుసుమాల్ని అరికాల రాచబోక
కసాయిలా నిండు బతుకుల కాల్చివేసే
కట్నరక్కసి కోరలు పీకివేయ,
తల్లి భారతి నిజముగ మోదమందు!

అవినీతి అగాధంలో కూరుకుపోయి
ఆత్మాభిమానాన్ని బజారున అమ్ముకోక
అది నీ దేశాభివృద్ధికి చీడపురుగని
ఆత్మసాక్షిగ తలచినపుడె
అమ్మ భారతి నిజముగ మోదమందు!

మూఢాచార ముసుగున మ్రగ్గియుండి
మూర్ఖ ఛాందస భావాలు వీడలేక
మగువ ప్రాణాలు "చితి" మంటల కాహుతిచేసే
మతోన్మత్తుల "సతి" దురాచార జాడ్యం
మంట కాలిన భారతి మోదమందు!

స్వాతంత్ర్య సమరోజ్వల దీవ్యదీప్తి
సాధించిన మహా మహుల బాట
సంశయము వీడి సదా సంచరించు
సందియము లేదు భారతి మోదమందు!

సమ సమాజ నిర్మాణమున కడ్డుపడుతూ
సతాయిస్తున్న రాకాసి రుగ్మతలను
సంహరింపుము సోదర భారత వీర!
సర్వలక్షణ శోభిత భారత మాత
సంతృప్తిచెందు, సదాదీవించు నిన్ను!



# స్త్రీ

ముద్దు మోమున చిరుదరహాసం
ముగ్ధ మోహనం ఆ వదనం!
మీనాలను మరపించు నేత్రములు
మచ్చుతునకలు దివారాత్రములు!
మూసీ, తెరిచే ఆ కనురెప్పలు
మణులను దాచు ముత్యపు చిప్పలు!
ముంగురుల అలలో ఆమోము
మబ్బుల మాటున ఆ ఇనబింబము!
మామిడి తరువుకు వ్రేలాడే
మావి పిందెలు ఆ చెవి దుద్దులు!
మిణుకు మిణుకని మెరిసే తార
ముక్కున తళుకను ముద్దు ముక్కెర!
మురిపెములొలికే నవ్వుల పువ్వులు
మధురాధరములు గులాబి రేకులు!
మగువ మనసు అతి సున్నితము
మానవ జగతికి పంచే అమృతము!

మగవని బతుకునకు అది యిరుసు
ముక్కలాయెనా చీకటి ముసురు।
మండుతూ తాను వెలుగును పంచు
మమతలు నిండిన అనురాగపు టంచు।
మరువగలమా ఆ సహచర్యము
మరపురానిది, ఆదరణీయము।
ముల్లోకముల కడు పూజనీయము
మూర్తీభవించిన ఆ త్యాగ గుణము।
మంచి కోరెనా సుఖముల గూర్చ
మరి ఆగ్రహించెనా జగతి రగుల్చు।
ముదిత ఓర్మికి పెట్టకు పరీక్ష
మనుగడలో యిక తప్పదు శిక్ష।।।



# నేనెవర్ని?

నేనెవరో మీకు తెలుసా?
నేను మీకందరికీ నేస్తాన్ని!
ఫలహారమాన్నా,
పచ్చి కూరగాయలన్నా నాకెంతో ప్రియం!
పైరు కోతలకు పశువు మేతలకు
నేనౌతాను మీకు సాయం!
శాకాహారిగా బతకాలనీ
శాంతి జీవనం గడపాలనీ నా ఆశ,
మీ ఆనందానికి, ఆరోగ్యానికి
మళ్ళించకండి నన్ను మాంసాహార దిశ,
మీ నేస్తం చిరుకోరిక మన్నించరూ?
నా మొర ఒకింత ఆలకించరూ!
నన్ను మానవ రుధిరానికి అలవాటు చేయకండి
మీ హృదిలో చెలరేగే మత్సరానికి
నన్ను పావుగా వాడకండి!
క్షణికావేశంలో నిండు ప్రాణాలను బలి తీసికోకండి!
మానవులతో నాకున్న తీపి బంధాన్ని తెంపకండి!
నెత్తురు కూటితో నాపొట్ట నింపకండి

నాకు శాంతి పాఠం నేర్చుకోవాలని ఉంది,
కాఠిన్యాన్ని కరుణగా మార్చాలని కూడా వుంది
విచక్షణతో నన్ను ఉపయోగించండి
వివేకంతో, విజ్ఞానముతో చరించండి
మీరు చేసే ఆనాలోచిత చర్య
ఎదుటివారి శాంతి సౌఖ్యాల హరిస్తుంది
సజ్జన సాంగత్యం, సకృత్యం నాకు ప్రసాదించు
స్నేహ సౌశీల్యాన్ని అందరికీ అందించు
ఇంతకీ నేనెవరో గుర్తించారా?
నేను-నేనండీ-మీ నేస్తాన్ని
వివిధ రూపాల్లో మీ అవసరాలను తీర్చే నేను
కత్తిని-అవునూ-కత్తినే!



# కపి(త)త్వం

నాకు, కవిత్వం వ్రాయాలని వుంది
కష్ట జీవుల ఘర్మ జల గాధల్ని
బడుగు జీవి బాధల్ని, బాహూబాధల్ని
ఎన్నో చెప్పాలని - మెప్పు పొందాలని వుంది
ఏమైనా బాధలుగాని బోధలుగాని
కష్టాలుగాని నిష్టలుగాని
నీతుల కోతలుగాని - రీతుల మూటలుగాని
విప్పటం తెలికే - చెప్పటం అవలీలే!
చెప్పింది చేస్తే - చేసింది చెప్తే
నేనూ అవుతాను మరో మహాత్మను!
మరి కావటం లేదంటే
శుష్క ప్రియాలు వల్లించడమన్నట్టే
శూన్య హస్తాల పిడికిలి బిగించడమన్నట్టే
ఇది నాఒక్కడి అవస్థనా?
కాదు! కాదు! కానే కాదు!
బీదల పేరుతో ఓట్లకై ఒకరు
మకరాశ్రువులతో సీట్లకై మరొకరు
బోల్తాకొట్టించే వేషాలు మార్చేదొకరు

ఉపన్యాసాల హోరుతో ఉదర గొట్టేదొక
వాగ్దానాల శబ్ద కాలుష్యాన్ని పెంచే దొకరు
ముడుపుల పొదుపులు పెంచేదొకరు
నినాదాలతో గోడల పాడుచేసే దొకరు!

వీరంతా, ఈ షరాబు దొరలంతా
గరీబు స్వేదాన్ని తుడిచివేయాలనీ
కూడూ, గుడ్డకూ, లోటు లేకుండా
''నీడ'' కు నీడను కల్పించడం కోసం
దివారాత్రిలు, ఉదయారుణ సంధ్యలు,
ఏ.సి గదుల్లో - మధుర మధు సేవనంలో
మగువల చుంబిత పరిష్వంగనంలో
మరతుపాకుల రక్షణ వలం
ఆకలిని ఆర్పేయాలనీ-
దారిద్ర్యాన్ని తుడిచేయాలనీ
ఆకలికి ఆమడ దూరంలో
అజీర్ణ వ్యాధులతో
పేదవానికి దూరంగా
పేదతనానికి సుదూరంగా
చర్చిస్తున్నారు - ప్రణాళికలు వేస్తున్నారు,
విమానాల్లో విహరిస్తున్నారు

విదేశీ యాత్రిలు చేస్తున్నారు
వేదికలను వేధిస్తున్నారు
త్వం శుంఠా, అంటే త్వం శుంఠా అంటూ
ఎదుటి వారిని గేలిచేస్తున్నారు
గోలపెట్టి విమర్శిస్తున్నారు
పవిత్రి చట్ట సభలలో ముష్టి యుద్ధాలు
అభినవ దుశ్శాసనులై వస్త్రాపహరణాలు,
ఎందుకూ? ఎందుకూ?
ఆకలిని ఆర్పేయాలనీ!
దారిద్ర్యాన్ని తుడిచి వేయాలని!

నేడు రాజ్యం కాదు  వీరభోజ్యం
ఉత్తర కుమార ప్రగల్భాల భాజనం
ఏళ్ళు గడుస్తున్నాయ్
దశాబ్దాలు దొర్లుతున్నాయ్
కృష్ణా, గోదావరి పుష్కరాలు వస్తున్నాయి- పోతున్నాయి!
ఏళ్ళు గడిచినా-గూళ్ళు కూలినా
కళ్ళు ఎండినా-కాళ్ళు విరిగినా
తోళ్ళు చివికినా-పళ్ళు పూడినా
పేదవాడి స్థానం మాత్రిం
ఎక్కడి గొంగళి అక్కడే!

అయినా ఆశతో-దురాశతో మంచి రోజుల కోసం
రోజుకో కొత్త వాగ్దానం వింటూ
ఎవరో వస్తారని-ఏదో చేస్తారని
చకోరంలా చూస్తూ చివికిపోతున్నాడు
చతికిల బడిపోతున్నాడూ
ఎవరూ?
రాజకీయ నేతల ఆశాదీపం
అతని బతుకంతా అగాధ కూపం!
బతుకలేక బతుకీడుస్తున్న బడుగు జీవి
రాజకీయ కళేబరాల మృత సంజీవి!
ఛ! ఇదేమిటి-ఎక్కడో దారి తప్పినట్టుంది
ఏదో కవిత్వం రాద్దామనుకుంటే
భూతంలాటి కపిత్వం నన్ను ఆవహించింది?
చక్కని కాగితాన్ని, చిక్కని సిరాని ఖరాబు చేస్తున్నది?
నా కవితా యత్నమంతా
గొంగళిలో భోంచేస్తూ వెంట్రుకలేరడమా?
సముద్రంలో చేదవేస్తే మంచినీళ్ళు వస్తాయా?
ఇంతకీ కవిత్వం అంటే ఎలా వుంటుంది?
సుందర ప్రకృతి దృశ్యాల వర్ణనమా?
ఊహల్లో విహరించే భావుకతయా?
బోలెడు మెలో డ్రామాతో ఆడపడుచుల
కన్నీళ్ళను ఖర్చుచేసి జేబులు నింపే సినీ ప్రక్రియా?
ఒక హీరో-యిద్దరు హీరోయిన్ల నవలికా?

ఆవేశంతో పిడికిళ్ళు బిగింప చేసే విప్లవగీతాలా?
ఉద్రేకాల కిక్కెచ్చే బూతు సాహిత్యమా?
ఇదేది అర్థం కాకుండా కవిత్వం వ్రాయాలనే
తపనతో, ఎంతో చక్కని తెల్లకాగితాన్ని
పేడలో ముంచినట్టు నాపిచ్చి(?) రాతలేమిటో
దీని పయన గమ్యం ఏదో!
పైన చెప్పిన వర్ణనలు - మెలోడ్రామాలు
ఆవేశాలు - ఉద్రేకాలు - సినీ ప్రక్రియలు
కన్నీళ్ళ ఖర్చులు మొదలైనవే కవిత్వాలు అయితే
దా కొద్దండీ - ఈ కవిత్వం——
నాదృష్టిలో అది కపిత్వం!



# పుట్టిన రోజు

పుట్టిన రోజున ప్రాణ స్నేహితులను
పసందైన విందులను-ప్రేమాన్విత పలకరింపులను
పూజ్యుల ఆశీస్సులను - పిన్నల అభినందనలను
అందుకొని మది పుష్పాంగ పులకించు నేస్తమా!
పుట్టిన రోజున పరమ సంతోషాన్ని
పదుగురితో పంచుకొని గర్విస్తున్నావా?
నీ సౌభాగ్యానికి మురిసి పరవశంతో ప్రమోదిస్తున్నావా?
నాణానికి ఒకవైపు మాత్రమే చూడకు మిత్రమా!
నీ బతుకు గమనంలో తుది మజిలి చేరుటకు
నిరంతరం పయనిస్తూ.........
ఒక్కో క్షణం నిక్షిప్తమవుతున్న గతాన్ని మరచి
పుట్టిన రోజనే మైలురాయిని దాటుతూ
జీవిత ఆఖరి ఘట్టానికి మరీ చేరువవుతున్నావని
మదినెంచక!
జీవిత ఖజానా ఖాళీ అవుతున్నదని ఆలోచించక
పెరుగుతున్న వయసునుగాంచి
తరుగుతున్న ఆయువును మరచి
పుట్టిన రోజు వచ్చిందని మురిసిపోతున్నావా?
ఆరోజున,

సంబరాలతో కాకుండా

నీ పునర్జన్మకు పెట్టుబడిగా

ఆర్తులకు అన్నపూర్ణగా

అన్నార్తులకు ఆత్మీయుడుగా

ఏదైనా ఓ సత్కార్యాన్ని చేయి

ఆర్తుల అభినందనలను

అన్నార్తుల ఆశీస్సులను అందుకోనేస్తం!

నీ పుట్టినరోజు ఒక విశేషమవ్వాలి

నీ పుట్టుక ఒక పరమార్థమవ్వాలి

నీజన్మకు ఒక సార్థకత ఏర్పడాలి

నినుచూసి ధరాతలం గర్వపడాలి!



# విద్యార్థి!

విద్యార్థీ!
వివేకమే నీ ధ్యేయంగా
వినమ్రతే నీ కవచంగా
విశుద్ధ ప్రవర్తనే శరణ్యంగా
విద్యనార్జించు విలక్షణంగా!

అతి పవిత్రమైనవి విద్యాలయాలు
అవి నీపాలిటి దేవాలయాలు
అధ్యాపకులే నీ దైవాలు
అణగార్చకు ఆ భావాలు!

దరిజేరకు రాజకీయలోగిళ్ళు
అవి నిను దిగజార్చెడు జారుడురాళ్ళు
పరమపదసోపానంలో పాములగళ్ళు
అని మరచితివా మిగులును కన్నీళ్ళు!

అవకాశవాద ప్రబోధాల జోలికిపోకు
అదంతా గాలివాటం అని మరువకు
తమ అభ్యున్నతికి పావుగా వాడతాయి నిన్ను
తుదకు నీ వ్రేలితో పొడిపిస్తాయి నీకన్ను!

తెరువబడిన పుస్తకం నీ జీవితం
అది వెదజల్లాలి సుగంధాల సౌరభం
ప్రతి పేజీ అనుభావాల పుంత
విస్మరించితివా మిగులును చింత!

దోచలేనట్టి విత్తము నీ విద్య
దాచినట్టి పసిడి పెన్నిధి నీ విద్య
యశభోగములనిచ్చు నీ విద్య
విద్యాహీనుడవైతివా బతుకంతా మిధ్య!

కన్నవారి కలలు పండగా
ఉన్నఊరు గర్వపడాలి నిండుగా
మన్ననలను సదాపొందు దండిగా
అనాడే బతుకున నిజమైన పండగా!

దురలవాట్లలను దూరంగా ఉంచు
దుర్జన సాంగత్యాన్ని మొదటికి త్రుంచు
తరగతుల బహిష్కరణ నీకే ముప్పు
ఉద్యమాలకు దూరంగావుంటే మెప్పు!

దేశానికి విద్యార్థులు వారసులు
భావితరానికి మీరే సారథులు
నిరక్షరాస్యతా చీకటిని పోగొట్టే దీపాలు
భారతమాత మణిహారంలో ముత్యాలు - రతనాలు!



# సంఘశక్తి - శ్రీసరాక్తి

మనిషి తానొక సంఘజీవి
మనిషి పూవైతే సంఘం తావి!
ఎన్నడూ కాదు వ్యక్తి సంఘానికి అతీతం!
సమిష్టి శ్రమయే అభివృద్ధికి సోపానం!
ఏన్నడు 'నీ'వల్ల మాత్రమే ఎదగదు సంఘం
"నేను" అనుమాట వచ్చెనా తప్పదు భంగం!
సంఘమనేది ఒక వట వృక్షం
మనము దాని ఊడలం అనేది సాక్ష్యం!
నీవెన్నడు కావు మహా తరువు
ఋతరులు నీ ఊడలు అనేది మరువు!
సంస్కారమనేది సంఘం నేర్పిన విద్య
నేనే సంస్కారిని అనేమాట మిథ్య!
నీ గొప్పలు నీ వెన్నడూ చాటుకోకు
పరులు గుర్తించాలి ఆ కిటుకు!
శ్వేత వస్త్రాలతో కాదు మది పునీతం
పులిచర్మం కప్పుకుంటే కాదు ఖరము శార్దూలం!
సంఘానికి స్వార్థానికి వాడుకోకు
నిజాల్ని దాచాలని సదా ప్రయత్నించకు!
అబద్ధాల్ని పదే పదే చేయకు ప్రచారం
అవి విస్ఫోటాలైతే మిగులును విచారం!

దొడ్డిదారిన నీ భావాలను యితరులపై రుద్దకు
అదే రాచబాటని ప్రగల్భాలు పలుకకు!
మిత్రుల అభివృద్ధిని అభినందించు
దానిని సర్వదా శతథా ఆహ్వానించు!
మేలు చేసిన మిత్రుని మరువకు!
కీడు తలచితివా వ్యర్థం ఆ బతుకు!
అతిచిన్నదని విస్మరించకు అంగుష్టం
అది లేకుంటే హస్తంగతి కడుకష్టం!
తెలివి తేటలకు అవరోధమా చిన్నతనం
ఆధిపత్యం ఆపాదించదు పెద్దతనం!
అందరితో కలిసి మెలసి తిరుగు
సుస్నేహం వల్ల గౌరవం పెరుగు!
అభిప్రాయాలను అందరితో పంచుకో
అభ్యున్నతి కద మార్గమని గ్రహించుకో
అందరితో చర్చించుట కాదు న్యూనత
మిత్రుల మన్నన పొందుట ఘనత!
ఎవరు నీకు శత్రువులుకారు
మన నడవడే చేయును దానిని ఖరారు
మనుష్యుల కూటమి సంఘమైతే
సంఘం వెలివేసెనా మరి అధోగతే
సంఘమనేది వ్యక్తిగాదు అద్వితీయశక్తి
అని మరిచితివా మిత్రమా ఆర్యుల శ్రీసూక్తి!



# శరణ్యం!

సాటి మనిషిపై చేయకు దౌర్జన్యం!
అమానుషంగా ప్రవర్తించకు అది నైచ్యం!
పశు పక్ష్యాదులపై చూపు కారుణ్యం!
పరోపకారమే నీకు శరణ్యం!



# నిజం

నిజం అనేది పడదు కొందరికి,
నిజానికి అది లేకుంటే బతుకంతా మురికి
నిజమనేది నివురుగప్పిన నిప్పు
నీ కొంగున దాచాలనుకుంటే ముప్పు
నిజం సర్వవేళలా, నీవెంట నీడలా
నిన్ను పెనవేసు కుంటుంది లత
నిజాన్ని వదిలించుకోవాలని భీరు
నిత్యం భయంతో పరిగెత్తితే ఎల



# ఉగాది చిగురులు

ప్రజల హృదయాలు ముదమున పల్లవించ
మోడులను చిగురింప నవవసంత లక్ష్మి,తా
దూతయై యేగుదెంచి, ప్రకృతికి తెచ్చె కొత్త శోభ
తన్మయత్వము నింపు ప్రమోదకు స్వాగతమ్ము!



మావిచిగురులు గతికి గళమ్ము స్వాంతమవగా
కుహు కుహూల సుప్రభాత గీత మాలపించి
నవ వసంతునికి చదువు శుభ మేలుకొలుపు
కోయిల మధుర గానమ్ము పలికే ఉగాదికి స్వాగతమ్ము



కొంగొత్త అనుభవాలు మాకు మిగిల్చి
కదులుతూ ముందుకు సాగుతున్నది
కంట తడితోడ శుక్లనామ వత్సరంబు
కరములెత్తి పలుకు శుభ వీడుకోలు!



జనావళి హృదయాల ఆనందమ్ము నింప
జీవితాల సుఖ శాంతులు గుమ్మరింప
జగతినేతెంచె ప్రమోద వత్సరంబు
జయము జయమటంచు పల్కు సుస్వాగతమ్ము!



నవ వసంత శోభల ఆమని
మావిచిగురులు కూర్చును హాయిని
కోకిల రావాలు చిందించు రసధుని
పచ్చని తొడుగుల ప్రకృతి జవ్వని
పులకించును హృది దానిని గని
మీ జీవితాన మోదము నింపమని
మనసారా కోరుతున్నాడు మీ నెమ్మని!

